ధారలగు యోధుల వర్ణనలు గలవు. మం 6 సూ 47 ఋ 10.26,27 లలో నిశిత కరవాలములు, యుద్ధరథములు, రణదుందుభులను గురించి వర్ణింప బడినది. మం 4 సూ 2 ఋ 8 లో గుఱ్ఱముల స్వర్ణాభూషణములభివర్ణితములు, మం 7 సూ 3 ఋ 7, మం 7 సూ 12 ఋ 14; మం 7 సూ 95 ఋ 1 లో నయోమయ దుర్గములును, మం 4 సూ 30 ఋ 20 లో శిలామయ నగరుల గురించియు చెప్పబడినది. మం 2 సూ 41 ఋ 5; మం 5 సూ 62 ఋ 6 లో సహస్రస్తంభ ప్రాసాదముల విషయమున్నది.

పై నుదహరించిన వాక్యముల వలన ఋగ్వేదకాలమున నార్యులు జీవిత ప్రథమావస్థలోనే యెట్టి యున్నతిని గాంచియుండిరనుట తెల్లమగుచున్నది.

ఋగ్వేదములో దస్యులు, దాసులు, అనార్యులతో జరిగిన భీకర యుద్ధవర్ణనలు కలవు. ఈ యుద్ధములలో ధనుర్బాణము లెక్కువగ నుపయోగింప బడినవి. గుఱ్ఱముల నుపయోగించిరి. ఈ యశ్వోపయోగమును దస్యులెరుంగకుండుటచే భయపడుచుండెరి. పాఠకుల నానంద పరచుటకై కొన్ని యుదాహరణలిందీయ బడుచున్నవి. ఇవి యన్నియు ఋగ్వేద సూక్తులు.

ఇంద్రియుద్ధము — "దీని నందరాహ్వానించిరి. ఇతనితో శీఘ్రగాము లుండుటచే నితడు భూమిపైనున్న దస్యులను, సిమ్యులను తన వజ్రముచే నాశమొనర్చి, వీరి చేలను తన యెఱ్ఱని మిత్రులకు [ఆర్యులకు] పంచిపెట్టెను వజ్రాధిపతి సూర్యుని ప్రకాశించునట్లు, జలముల వర్షించునట్లు చేయును.' [ఋ 1-100, 18]

"ఇంద్రుడు శక్తి, వజ్రములచే దస్యుల దేశమును నాశన మొనర్చి, తన యిచ్ఛానుసారము తిరుగసాగెను. ఓ వజ్రీ! నీవు మా సూక్తులను గమనింపుము. దస్యులపై నీ శక్తిని ప్రయోగించి, ఆర్యుల శక్తి, యశముల పెంపొందజేయుము" [ఋ 1 సూ 103 3]

"ఏయపుడితరుల ధనమెందున్నదో తెలిసికొని, దానిని తానుపయోగించును. వాడు నీళ్లలోనుండి దానిని పాడుచేయును. వాని స్త్రీలిరువురు

నదిలో స్నానము చేయుచున్నారు. సీకానదిలో స్నానము చేయుచున్న వీరు మునిగి చత్తురుగాక."

"అరయుడు నీటిలో నొక గుప్తమగు కోటలో నుండును. వాడు జల రక్షణ వలన సుఖముగ నున్నాడు. అంజసీ, కులిశీ, వీరపత్నీ, నదీజలములు వానిని రక్షించును." [ఋ 1-104-3-4].

'ఇంద్రుడు తన యుద్ధములో నార్యులలోని పూజనీయుల రక్షించును. వాడు వారిని వేనవేల సంవత్సరముల నుండి రక్షించుచున్నాడు. అన్ని యుద్ధములలో వారిని రక్షించును. ప్రాణహితమును గోరి [ఆర్యుల శ్రేయస్సు] యజ్ఞము చేయనివారి నతడు దేశమును వీడిపోవునట్లు చేయును. శత్రువుల నల్ల తోలు నతడు వలిపించి చంపివేయును, మరియు [కాల్చి] బూడిద చేసివేయును. హాని కలుగ జేయునట్టియు, నిర్దయులు నగు వారి నితడు కాల్చి వేయును.' [ఋ 1-308]

"ఓ శత్రునాశకా! ఈ దోపిడి గాంధ్ర శిరముల రాశిచేసి నీ విశాలమగు పాదములచే నణచి వేయుము. నీ పాదము విశాలమైనది."

"ఓ ఇంద్రా! ఈ దోపిడికాంధ్ర బలమును నాశమొనర్చుము. వారి నీ పాపకూపమున బారద్రోయుము."

"ఓ ఇంద్రా! నీ విట్టి జనుల మూడేబదుల నాశమొనర్చితివి. జనులు ఈ నీ పనిని పొగడుదురు. అయిన నీశక్తి ముందిది యొక ఘనత కాదు."

"ఓ ఇంద్రా! అక్కడ వన్నెగల పిశాచముల నన్నిటిని, విఘ్నములు కలిగించును కావున, చంపి వేయుము. ఈ రాక్షసులనందరిని నాశ మొనర్చుము." [ఋ 1-133-2-5]

"అశ్వినీ దేవతలారా! కుక్కల వలె మొఱుగుచు మమ్ము చంపుటకై భీకరముగ వచ్చుచున్న ఈ జనులను నాశమొనర్పుడు. మాతో యుద్ధము చేయవలెనను కోరికగల వారినే జంపుడు. వారిని నాశమొనర్చు నుపాయము మీ రెరుగుదురు. మిమ్ము ప్రార్థించు వారి కిష్టావ్యాప్తి చేకూరుగాక. సత్య దేవతలారా ప్రార్థన నంగీకరింపుడు."

దధి కాశ్వము :—

అమెరికా ఖండమును గెలుచుటకు స్పేనువాసుల గుఱ్ఱములే మూల కారణములు. ఆగుఱ్ఱముల యుపయోగ మెఱుగని అమెరికా యాదిమ నివాసులు వాటినిజూచి భయపడుచుండిరి. పూర్వకాలమున నార్యుల గుఱ్ఱములుగూడ నార్యేతర ప్రజలను భయపెట్టి యుండును. 'దధికా' అను దేవతుల్యమగు యుద్ధాశ్వమును గురించి యొక సూక్తమున నిట్లున్నది.

,,గుడ్డలు దొంగలించిన వానినిజూచి జనులల్లరి చేయునట్లు శత్రువులు దధికను జూచి గోల చేయుదురు. డేగనుచూచి పక్షులార్భటించునట్లు భోజన, పశుసంగ్రహార్థము దిరుగు దధికనుజూచి శత్రువులు గగ్గోలు పడదురు.''

,,విద్యుల్లేఖవలె మెరయుచు, నాశమొనర్చు దధికను జూచి శత్రువులు భయపడుచుండిరి. తనచుట్టునున్న వేనవేల జనుల బరిమార్చి యురుకు నప్పుడది కోపపూరితమై యుండి యధీనమును మీరియుండును.''

(4-38-5 మరియు 8)

ఋగ్వేదములోని అనేక వాక్యములలో నల్లవారిని జంపు 'కృత్స' యనునొక ప్రతాపశాలి యగు శక్తియుండినట్లు తెలియుచున్నది. మం 4 సూ 16 లో ఇంద్రుడు 'కృత్స'కు ధనమిచ్చుటకై మాయావియు పాపియు నగు దస్యుని సంహరించెను. 'కృత్స' ఇంద్రునికి నేబదివేల 'కృష్ణశత్రువులను' నాశమొనర్చుటలో తోడ్పడెను. మం 4. సూ 28. ఋ 4 నుండి ఇంద్రుడు దస్యులను గుణహీనులుగను, సర్వమానవులచే గర్హింపదగిన వారుగను చేసెనని తెలియుచున్నది. మం 4 సూ 3 ఋ 15 లో నింద్రు డొక వేయిన్ని యైదువందల [1500] దాసులను నాశమొనర్చినట్లు జెప్ప బడినది.

మం 5 సూ 7 ఋ 3; మం 6 సూక్త 18 ఋ 3 మరియు మం 6 సూ 25 ఋ 2 లో దస్యుదాసులను పారద్రోలుటయు, వారిని జంపుటయు వర్ణింపబడినది. మం 6 సూ 41 ఋ 2 లో దస్యులజ్ఞాతమునందు నొక స్థల వర్ణనమున్నది. అది యెంతయు ననువదింప దగినది.

"దేవతలారా! మేము యాత్రల జేయుచు త్రోవదప్పి, పశువు లేనిచోటు మేయునట్టి ప్రదేశము జేరితిమి. ఈ విశాల ప్రాంతము కేవలము దస్యులకు మాత్రమావాసమైనది. ఓ బృహస్పతీ మాకు మా పశువుల నెనుకుటకు తోడ్పడుము. ఓ ఇంద్రా! త్రోవదప్పిన నీ భక్తులకు మార్గదర్శకుడవు గమ్ము."

అదిమ వాసులు జేయు గోలను ఆర్యులు సహింపక నిందించి యున్నారు. ఈ సభ్యవిజయగణ మాదివాసుల రొద నొక భాషగా నంగీకరింపక పలుచోట్ల నీయనాగరకులకు భాషయే లేదని వాకొనిరి. (మం 5 సూ 29 ఋ 10 ముచ్చగునవి.)

పైన నాదిమనివాసులును చోరులునగు 'దయవాయు'ల సంగతి వ్రాయబడినది. వారు నదీపరివేష్టిత దుర్గములలో నవసించుచు, గ్రామ వాసులగు నార్యులను బాధించుచుండిరి. పలుచోట్ల – మూడవ యాదిమ వాసియగు – ప్రబల నాయకుని వర్ణనయు గానవగును. అతను నల్లగా నుంటచే నతనిని 'కృష్ణ' యని పిలిచిరి.

"ఆ కృష్ణు డంశుమతీ తీరమున పదివేల సేనతో వసించుచుండెను. ఇంద్రుడు తన తెలివితేటలచే నీ గోల చేయు యోధుని భావను తెలియ గలిగెను. అతడు మానవుల [ఆర్యుల] హితమును గోరి యీసైన్యమును నాశమొనర్చెను."

"నేను తేజశ్శాలి యగు కృష్ణుని జూచితినని ఇంద్రుడనెను. సూర్యుడు మేఘముల మాటున దాగియుండునట్లు వాడంశుమతీ తీరస్థ గుప్త స్థలమున దాగియున్నాడు. ఓ మరుత్తుడా! వానితో యుద్ధముచేసి నీవు వానిని జంపవలెనని కోరుచున్నాను."

"అప్పుడంశుమతీతీరమున నా తేజశ్వియగు కృష్ణుడు గనుపించెను. ఇంద్రుడు, బృహస్పతి సహాయమున నా తేజమును దేవతాసైన్య సహాయము లేకనే నాశమొనర్చెను." [8.96.13,15]

దస్యులు నిరర్థకములగు ధ్వనులుజేయు భాషరాని వారనిమాత్రమే గాక, పలుచోట్లలో వారు మనుష్యులలోగూడ పరిగణింప బడలేదు. ఒకచో నిట్లు వ్రాయబడెను.

“మేము నలువైపుల దస్యులతో చుట్టబడియున్నాము. వారు యజ్ఞములజేయరు; ఏవిషయమునను విశ్వాసముంచరు. వారి వ్యవహార రీతులు భిన్నములు. వారు మనుష్యులు గారు. ఓ శత్రునాశకా! వారిని హతమార్చుము. దస్యుజాతిని నాశమొనర్చుము.’ [10-22-8].

మం 10 సూ 49 లో ఇంద్రుడిట్లనుచున్నాడు: ‘నేను దస్యులను పిలచుపట్ల ‘ఆర్య’ శబ్దముపయోగించుట లేదు. [ఋ3]. దస్యుజాతుల నూత్నవాసములను బృహద్రథుని నాశమొనర్చితిని. [ఋ6]. దాసులను గోసి ముక్కలజేయుదును. వారిగతిని ప్రాప్తించుటకే జన్మమొందిరి.” [ఋ7].

‘సుదాసు’డొక గెలుపొందిన యార్యులరాజు. అతనితో ఆర్యుల సేనలు, రాజులుగలసి యుద్ధముజేసిరనియు నత డందర నోడించెననియు వర్ణింపబడినది. ఆర్యులనడుమ వినాశకరములగు యుద్ధములును, సుదాసునితో బవరములజరిపిన జాతులననుసరించియు ఋగ్వేదమున నితిహాస దృష్టితో చక్కని వివరములగలవు.

8. “ధూర్తులగు శత్రువులు నాశనోపాయములజేసి, ‘యదిన’ నదీబంధమును ద్రెంపిరి. ఆయిన సుదాసు స్వశక్తిచే పుడమిపైనిలచెను. ‘చయమాను’ని కొడుకుచచ్చెను.”

9. “ఏరు వెనుకటివలెనే పోవుచున్నది. దానిలో నెట్టిమార్పును లేదు. సుదాసునిగుఱ్ఱము దేశమంతటను జుట్టివచ్చినది. ఇంద్రుడు వైరులను సంతానసమేతముగ సుదాసుని యధీనమొనర్చెను.”

సుదాసుని యుద్ధములు:—

11. సుదాసు దిరువైపులనున్న నిరువదొక్కరిని జంపి యశము నార్జించెను. యజ్ఞశాలలలోని కుశలను యువకుడగు పురోహితుడు

కత్తిరించునట్లు సుదాసుడు తన శత్రువులను గండరించెను. అతనికి తోడుగా 'మరుత్సు'ని వీరుడగు నింద్రుడు బంపెను.

14. ''శత్రులగు అనుద్రుహ్యుల 66666 గురు పశువులను బట్టి వచ్చిన యోధులందరు సుదాసుచే నిహతులైరి. ఈ పనులన్నియు నింద్రుని ప్రతాపముల గొనియాడుచున్నవి.''

11. ''ఇంద్రుడే సుదాసునిట్టి కార్యములజేయ సమర్థునిగ జేసెను; అతడొక గొఱ్ఱెనొక పులితో ధైర్యముగ బోరునట్లు చేసెను. ఇంద్రుడు బలిదండము నొక సూదిచే పడగొట్టి సర్వసంపదల సుదాసునకిచ్చెను.''
(7.18)

తృప్తులేక వశిష్ఠఋషి సుదాసుని యశమును గొనియాడుచు శాశ్వతముగనుండు తన ఋచలకై యతని పురస్కారమును బడసెను. 22,23 ఋక్కులలో వీరసుదాసు తనకు రెండువందలయావులను, రథములను సువర్ణభూషణములచే నలంకృతములగు నశ్వచతుష్టయములనిచ్చెనని కృతజ్ఞతను చాటియున్నాడు. ఈ క్రింద నతని వేరొక సూక్తముదాహరణముగ నివ్వబడుచున్నది.

1. 'సురపతీ' వరుణులారా! మిమ్ముపాసించువారు మీపై విశ్వాసముంచి పశువులగెల్చు నభిప్రాయముచేత వస్త్ర శస్త్రములగొని పూర్వదిక్కునకు బోయిరి.'

'ఇంద్రా వరుణులారా! మనశత్రువులు దస్యులు కానిండు, ఆర్యులు కానిండు యెవరైనను నాశమొనర్చి సుదాసుని రక్షింపుడు.'

2. 'ఎచట శత్రువులు పతాకాలనెత్తి మాతో యుద్ధముచేయ నుంకింతురో, ఎచట మాకేమియు సహాయమొనర్చు వారుండరో, యెచట జనులాకాశమునుజూచి భీతిల్లుదురో యచ్చటచ్చటు ఓ ఇంద్రా వరుణులారా మాకు సాయముచేయుడు, మాకుధైర్యమిండు.'

3. 'ఓ ఇంద్రావరుణులారా! పుడమి తన ఎల్లలను గోల్పోయినట్లు గనబడుచున్నది. శత్రువుల యార్భాట మాకాశమందంతటను నిండు

కొనినది. వారిసైన్యము సమీపించుచున్నది. ఓ ఇంద్రావరుణులారా ! మీ రనిశము మాప్రార్థనల వినుచుందురు. మాదరిజేరి మమ్ము రక్షింపుడు.

4. 'ఇంద్రా వరుణులారా ! మీరింకవరకపరాజితుడగు 'భేదు'ని జంపి సుదాసుని గాపాడితిరి. 'తృత్సు'ల ప్రార్థన లాలకించితిరి. వారి దీనమగు ప్రార్థన యుద్ధసమయములో ఫలించినది.'

5. 'ఓ ఇంద్రావరుణులారా ! శత్రువుల కరవాలములు మాపై నలువైపులనుండి యెత్తబడుచున్నవి. వారు మావస్తువు లపహరించి, యాక్రమించుచున్నారు. మీరీ రెండువిధముల సంపదల కధినాధులుగనున్నారు. యుద్ధదినమున మమ్ము రక్షింపుడు.'

6. యుద్ధసమయమున నిరువాగులవారును సంసిద్ధులై ఇంద్రావరుణులను ప్రార్థించుచుండిరి. అయిన నీయుద్ధములో మీరు 'తృత్సు'లతో గూడిన సుదాసును పదుగురురాజుల యాక్రమణనుండి కాపాడితిరి.

7. 'ఓ ఇంద్రావరుణులారా ! ఆ పదుగురురాజులు యజ్ఞములు జేయని కారణమున గుమిగూడియు సుదాసును బట్టలేక పోయిరి.'

8. 'ఇంద్రావరుణులారా ! సుదాసు పదుగురు యోధులతో జుట్టబడినప్పుడు తెల్లని వస్త్రములగట్టి, జటాజూటములతో నొప్పు 'తృత్సు'లు నైవేద్యములతోడను, సూక్తులతోడను మిమ్ము పూజించుచుండగా మీరు సుదాసునకు శక్తినొసంగితిరి.' [7-83]

1. 'యుద్ధము సమీపించినప్పుడు యోధుడు కవచమును తొడగికొనిపోవుచుండగా మేఘమువలె గన్పట్టును. ఓ యోధుడా ! నీ శరీర మచ్ఛేద్యముగాక ! నీవు జయ, లాభముల బడసెదవుగాక. నిన్ను నీ శస్త్రాస్త్రములు రక్షించుగాక.'

2. 'మేము ధనువులచే బశువుల గెలిచెదము. మాకు ధనువులచే జయము ప్రాప్తించును. మేము ధనువులచే భయంకరులగు శత్రువుల నాశ

మొనర్చి వారి యభిలాషల నష్టమొనర్చెదము. మేము ధనువులచేతనే మా విజయము నలువైపుల బ్రసరింప జేయుదుము.'

3. ఘనస్వనముగల వారిని లాగినప్పుడు దీని ధ్వని యుద్ధభూమిలో బాణముల గురిపింపవచ్చు. పగవానిచెవికి సోకును, వాని చెవిలో ధైర్య వచనముల జెప్పి, వాని బాణమును ప్రియురాలు తన భర్తకంఠమును కౌగ లించునట్లు జుట్టుకొనును.'

5. 'తరకస' మన్ని బాణములకు దండ్రివంటిది. బాణములన్నియు దానికి బుత్రసమములు. అది యార్భటించుచు యోధుని వీపుపై నున్నప్పుడు యుద్ధము నుండి దాటించి, శత్రువులను గెలుచునట్లు చేయును.'

6. 'చతురుడగు సారథి తన రథముపై నిలుచుండియే దిశకైన రథ్యముల దోలగలడు. కళ్లెములు గుఱ్ఱముల నణచిపట్టి యుండును, అతని యశమును బాడుడు.'

7. 'హయములు హేషలొనర్చు ఖురాగ్రముల ధూళి రేపు చున్నవి, మరియు రథము సీడ్చుకొని క్షేత్రములవైపున కరుగుచున్నవి. అవి చలింపక గొప్ప దోపిడి గాండ్రను తమ పాదలచే నణచి త్రొక్కుచున్నవి.'

11. 'బాణములకు ఈకలు గట్టబడినవి. వాటి మొనలు జింక కొమ్ములతో గూడియున్నది. బాగుగా నవి తీవల నుండి లాగబడి విడువ బడునప్పుడు వ్యష్టిగను, సమిష్టిగనున్న శత్రువులపై బడి లాభముల బడయును.

14. 'ముంజేతికి జుట్టబడిన తోలుపట్టా సింగడితీగ రాపిడినుండి తప్పించును. అది పామువలె చేతికి జుట్టుకొని యోధుని రక్షించును.'

15. 'పర్జన్యుని బాణము ఇనుప మొనగలిగి విషములో ముంప బడినది. ఆ బాణమును మేము వర్ణించెదము.'

ఋగ్వేదము నుండి, ఆర్యులెడతెగక యుద్ధముల జేసి సింధునది నుండి సరస్వతి వరకును, పర్వతముల నుండి సాగరమువరకును గెలిచికొని యుండి

రనుట సిద్ధమగుచున్నది. ఋగ్వేదములో సింధు మరియు దాని యుపనదు లైదును గురించి 10వ మండలములో 75 వ సూక్తములో నున్నది. ఈ సూక్తములో మూడు పెద్ద పెద్ద ప్రవాహముల వర్ణన కలదు. ఒకటి పశ్చిమోత్తరముగ ప్రవహించి సింధులో గలియునట్టిది. రెండవది పూర్వో త్తరముగ ప్రవహించి దానిలో గలిసి దూరమున నున్న గంగాయమునలలో గలియునట్టిది. ఈ ప్రకారముగా నొక భౌగోళిక సీమ యేర్పడు చున్నది. దాని యుత్తరమున హిమాలయము, పశ్చిమమున సింధు నదియు సులేమాన్ పర్వతములు, దక్షిణమున సింధు నదియు సముద్రము, మరియు తూర్పున గంగాయమునలు గలవు. పంజాబులోని యైదునదులును, సింధు, సరస్వతీ నదులను గలిపి సప్తనదులని పేరీయ బడినది. సప్తనదులకు సింధుమాత వంటిది. (మం7 సూ36 ఋ6.)

భరత ఖండమున గంగాయమునా ప్రవాహముల యావిర్భావము గానప్పుడు సరస్వతీ నదియే భారత సర్వప్రధానమగు నదిగా నుండినది. దీని ప్రవాహమత్యంత విస్తీర్ణమై, ప్రబలమైయుండెను. ఋగ్వేదపు 6,7 మం 11లలో క్రమముగా సరస్వతి వర్ణన కలదు. ఇట్టి సరస్వతీనదీ కాలక్రమమున యెండి పోయినదనియు, అది గంగా యమునలతో గలసి ప్రయాగ చెంత గుప్తగామినియై యున్నదనియు హిందువులు విశ్వసించు చున్నారు. ఆ నది హిమాలయమునుండి వెడలి సముద్రమువరకును విస్త రిల్లి యుండినది. వేదమంత్రములలో సరస్వతీ నదిని.

‹‹అయిత్నాకం యశసోవావశానాః సరస్వతీ సప్తథ్థా సింధుమాతా।
యాఃసుష్వపంత సుదుఘాః సుధారా అభిస్వేత పయాసాపీప యానాః›› [ఋ. మం 7 సూ59]
‹‹దృషద్వత్యాం మానుష అపయాయాం సరస్వత్యాంరేవ దగ్నే దిదీహి॥''

‹‹శత్రువుల యాక్రమణనుండి రక్షించుటకు దుర్గసీమవలె సురక్షిత మును, సుదృఢములగు లోహకవాటములవలె నున్నదని చెప్ప బడినది. వేగవతి యనుటలో ‹‹రథ్యేవయాతి›› రథము నెక్కి పోవును. మరియు నీ

సరస్వతి యితర నదులను తన మహాత్వమును పరాస్తమొనరించినట్లు వర్ణింపబడినది.

పురాణములనుండి తెలియునదేమన : హిమాలయ, ప్లక్షప్రశ్రవణ మున సరస్వతీ వెడలినదనియు, నీపుణ్యతీర్థము ప్రాయూదక కురుక్షేత్రపు బ్రహ్మావర్త ప్రదేశములో నడచుచు క్రమముగ నైరుతికి దిగుచు ద్వారక చెంత సముద్రమున గలియుచున్నది.

ఈ సరస్వతీ తీరమున ప్రజాపతియగు బ్రహ్మ మొదలుకొని యనేక దేవతలు, ఋషులు, మునులు గొప్ప గొప్ప యజ్ఞముల జేసిరి. మరియు సప్తఋషులు మున్నగు గాకల వారందరును సరస్వతీ తీరమున యాశ్రమ పదముల నిర్మించుకొని యుండిరి. బ్రహ్మావర్తమను ప్రదేశమున కురుక్షేత్ర సమీపమున నీ ఋష్యాశ్రమము లధికముగనుండినవి.

మనుస్మృతిలో :—

"సరస్వతీ దృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరం ॥
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం విదుర్బుధాః॥"

అనగా సరస్వతీ మరియు దృషద్వతుల నడిమి దేశము బ్రహ్మావర్తమన మనబడెను. ఇతిహాసపుమాట ఎంత చిన్నదైనను విచారయోగ్యము.

తైత్తిరీయ, శతపథ బ్రాహ్మణములలో నీక్షేత్రమును గురించిన ప్రశంసగలదు. మహాభారత శల్యపర్వములోను, గదాపర్వమునను బలరాముని తీర్థయాత్రా ప్రకరణము సారస్వతోపాఖ్యానపు పలుచోట్లయందును సరస్వతీ మరియు కురుక్షేత్రము లభివర్ణితములైనవి. బలభద్రుడు తీర్థయాత్రలకు వెడలినప్పుడు ద్వారకనుండి సరస్వతీ తీరస్థ ప్లక్షప్రశ్రవణ పర్వతముపై కెక్కెను. ఇచ్చటి సరస్వతీనది శోభనుజూచి యతడిట్లు వర్ణించుచున్నాడు.

సరస్వతీవాస సమాకుతోరతిః
సరస్వతీవాస సమాకుతోగుణాః ।

సరస్వతీ ప్రాప్యదివంగతాజనాః ।
సదాస్మరిష్యన్తి నదీం సరస్వతీం ॥
సరస్వతీ సర్వనదీషు పుణ్యా,
సరస్వతీ లోక సుఖావహా సదా ।
సరస్వతీ ప్రాప్యజనాః సుదుష్కృతం,
సదానశోచన్తి పరత్ర చేహచ ॥

తీర్థపుణ్యతమం రాజన్ పావనం లోక విశ్రుతం ।
యత సారస్వతో యాతః సో౽ఙ్గిరా స్తపసోనిధిః
తస్మిన్ తీర్థేవరః స్నాత్వా వాజిమేధం ఫలంలభేత్ః
సరస్వతీ గతించైవ లభతే నా౽త్ర సంశయః ॥

పైశ్లోకములో ‘‘ సరస్వతీ ప్రాప్య దివంగతాః,, మరియు ‘సరస్వతీ గతంచైవలభతే,, మొదలగు శబ్దములచే బలరామునికి పూర్వమునుండియే ‘సరస్వతి’ యెండిపోయి యుండునని నిశ్చితమగు చున్నది. దీనిని సమర్థించుచు నదేతీర్థయాత్రా ప్రకరణమున నింకను నుదాహరణములు గలవు.

‘‘తతో వినాశనం రాజన్ జగమాథహలాయుధః ।
శూద్రాభీరాన్ ప్రతిద్వేషాద్యన్న నష్టాసరస్వతీ ॥
యస్మాత్సాభరత శ్రేష్ఠ ద్వేషాన్నష్టా సరస్వతీ ।
తస్మాత్తదృష్టయోనిత్యం ప్రాహుర్వినశనేతిహి ॥

దీనివలన తెలియునదేమనశూద్రాభీర జాతులకు గలిగిన ప్రీతి బంధ కారణమున నేప్రదేశమున సరస్వతీ నది నష్టమైనదో దానికి వినశనమని పేరు వచ్చినది. ఈ వినశన ప్రదేశము నేటి మేవాడ ప్రాంతమునకు పడమటి భాగమునయున్న ప్రదేశమని తెలియుచున్నది.

మహాభారత కాలముననే సరస్వతీనది నష్టమై యుండినది. అయిన నైమిశారణ్య తీర్థమునను పుష్కరము, గయ, ఉత్తరకోసల ఋషభ ద్వీప, గంగాద్వారములును, కురుక్షేత్ర హిమాలయాదిస్థానములతో సరస్వతీ ప్రవాహ వర్ణనలు లభించును.

ఈ వర్ణనల వలన మిక్కిలి విశాలమగు సరస్వతీ వాహిని ఉష్కించి నను, అందందు దాని చిన్నచిన్న ధారలు మహాభారత కాలము వరకుండినట్లు తెలియు చున్నది. ఇట్టి యేడు ప్రవాహములు సురేణువనునదొకటి ఋషభద్వీపమునను, ఒకటి గంగాద్వారమునను ఈ ప్రకారము మొత్తము తొమ్మిది వాహినుల విషయము దొరకు చున్నది. వీటికి వేరు వేరు పేర్లు పెట్టబడి తీర్థముల వలె ప్రసిద్ధములై యుండెను.

వేదప్రసిద్ధమగు సరస్వతీవాహిని పశ్చిమాభిముఖియై ప్రవహించి, పశ్చిమ సముద్రమున ద్వారకచెంతసాగర సంగమమైనట్లు వర్ణింపబడిన విషయము విచార యోగ్యమైనది. మరియు తూర్పున ప్రయాగ వరకు ప్రవహించినట్లగుపడని సరస్వతీనది ప్రయాగస్థ త్రివేణీ సంగమస్థానమున కెట్లు ప్రసిద్ధి గాంచెను ?

సరస్వతీ నదియొక్క ముఖ్యవాహిని యగు 'మహానది' ప్లక్షప్రస్ర వణమునుండి వెడలి కురుక్షేత్ర సమీపమున నేటివరకున్న 'స్థాణు తీర్థము' వరకు ప్రవహించి యుండినది. అచటనుండి యానది ఉదయపూరునకు నైఋతిగ సిద్ధపూరు, పాట్నా, మాతృగయలను దాటుచు 'కచ్ఛ' సమీపమున ద్వారకకు పడమట సింధుశాఖలో గలియుచున్నది. దానిదేయగు 'సురేణు'వను సుప్రసిద్ధశాఖ, దక్షుడు యాగమొనర్చిన చోటు - ప్రయాగ క్షేత్రమున - గంగాయమునా సంగమములలో గలసి యుండును.

శ్లో. సురేణు ఋషభద్వీపే పుణ్యే రాజర్షి సేవితే ।
కురోశ్చ యజమానశ్చ కురుక్షేత్రే మహాత్మనః ॥
ఆజగామ మహాభాగ సరిత్ శ్రేష్ఠా సరస్వతీ ।
ఓఘవత్యపి రాజేంద్ర వశిష్ఠేన మహాత్మనా ।
సమాహూతా కురుక్షేత్రే దివ్యతోయా సరస్వతీ ॥
సురేణురితి విఖ్యాతా ప్రస్రుతా శీఘ్రగామినీ ।
విమలోదా భగవతీ బ్రాహ్మణా యజతాపునః ॥

సమాహూతాయ యాతత్ర పుణ్యే హైమవతే గిరౌ ।
ఏకీభూతా స్తతస్తాస్తు తస్మిన్ తీర్థే సమాగతాః ।

సప్త సారస్వతం తీర్థ స్తతస్త్వప్రథితం భువి ।
ఇతిసప్త సరస్వత్యో నామతః పరికీర్తితాః ।
సప్త సారస్వతం చైవ తీర్థం పుణ్యాం తథాస్మృతం (మహాభారతము)

ఋగ్వేద మంత్రములలో నగుపడు "సప్తసింధు" "సింధుమాతా" మరియు "సింధుకన్యా" అను శబ్దములనుండి పంజాబులో ప్రసిద్ధమగు సింధునది మరియు నితరములగు నైదు నదులను గొప్పదగు సరస్వతిలో గలసియుండెను. (పంచనద్యః సరస్వతీ మపియాన్తి సస్రోతసః) యజుర్వేదములోగూడ నొక మంత్రము "సరస్వతీతు పంచధా సాదేశేఽభవత్సరిత్" య. అ. 34. క 11 కలదు.

(మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతికేతునా ఋ. మం 1. 3. సూక్తము) పంజాబునకు పూర్వము 'సారస్వత' మను పేరు ప్రసిద్ధమైనది.

ఋగ్వేదములో జాతి, వర్ణములను గురించి పేర్కొనిన విషయములను ప్రత్యేకముగా నుల్లేఖింతును. అయిన నిప్పుడున్న జాతి, వర్ణవ్యవస్థలు అప్పుడు మాత్రము లేకుండినవని అవశ్యకముగ జెప్పగలను. ప్రతి యింటికిని నాయింటి పురోహితుడే స్వామియనబడుచుండెను. అతడు తన పరివారముతో వేదమంత్రోచ్చారణమున నాయింటిలో నగ్నిప్రతిష్ఠ హవనముల జేయుచుండెను. ఆనాడగ్ని సృజింప బడుటయు నొక మహాత్కార్యముగ నెన్నబడి యుండెను. గుడ్డల కొరత, అడవిలో నివసించుట, నిప్పును గలిగించు వస్తువులు లభింప కుండుట మున్నగు పరిస్థితులచే నాటి సౌకర్యముల నూహింప వచ్చును.

ఆ కాలపు స్త్రీలన్ని పనులలో భాగము వహించు చుండిరి. అప్పటి యాడువారు స్వయముగ ఋషులు అనగా మంత్రద్రష్టలుగనుండి హోమముల జేయించు చుండిరి. వారికెట్టి నిర్బంధనములు లేకుండినవి; తెర వెనుక దాగియుండు దుర్గతియు లేదు. విదుషియగు "విశ్వవార" అనేక సూక్తముల రచించినది. ఆమెను గురించి మం 5 సూ 28 అ 3 లో తెలుపబడినది. నాడున్న స్వేచ్ఛను నేటి స్త్రీ లోకమునకున్న నిర్బంధములను పోల్చి

చూచినచో సంఘమును దిఃకరింప మనసు పుట్టును. తండ్రిఇయాస్తిని పంచు కొన్న కన్యలను గురించియు (మం 2 సూ 17, సూ 7) లో కలదు. తరు వాత లేచి గృహముల దిద్దుకొను ప్రాతఃకాలము బోలు పవిత్రులగు స్త్రీలను గురించి మం సూ 124 ఋ 4 లో లభించును. కన్య భర్తను వరించు చుండెను. దీనిని గురించిన ప్రబల ప్రమాణము లందభివర్ణితములు. వివాహ రీతులు తత్ప్రష్టములై యుండెను. 'కన్యాదానా'ధి కారము తండ్రికి లేకుండెను. ఋగ్వేద సమ్మతములగు ననేక విషయముల ముందు జర్చింతము.

ఋగ్వేద కాలమున సర్వశక్తియుతుడును, విశ్వ వ్యాపియు నగు సర్వేశ్వరు నొక్కని తమ దేవునిగా నప్పటివారు భావించు చుండిరి. అయిన ఋగ్వేద ఋషిగణము ప్రకృతినుండి ప్రకృతి దేవతల వైపు సాగినది. వారు ప్రకాశవంతమై, మహా వ్యాప్తమగు నాకాశమును, ప్రకాశోష్ణము లను సారించు సూర్యుని జీవన ప్రదుడగు వాయువును; అఖండజలముల వర్షించి క్షేత్రముల కాధార భూతమగు వర్షమును దేవతలుగా భావించి, పూజించిరి. వీటిలో "ద్యు" ఇంచుమించు యవనుల "జీఉస", రోమనుల "జ్యూపిటరు" శబ్ద ప్రథమాక్షరము "జ్యూ" మరియు సేక్సనుల "టీడ" శబ్దములయు, జర్మనుల "జిఓ"ల స్వరూపమై యున్నది.

గ్రీసు మరియు రోమక దేవతలలో 'జీఉస', 'జుపిటరు'లు చాలా కాలము వరకు గొప్పవారుగ భావింపబడిరను; వైదిక దేవతలలో "ఇన్ద్రుడు" విశిష్ట స్థానము నాక్రమించెను. దీనికి భారత దేశమున సేలేటు జలపూర్ణ ములై ప్రవహించు నదులు, సస్యేందిరతో కళకళలాడు సుక్షేత్రములు, ఫలితములు, మున్నగునవి ఆకాశమునకన్న మేఘము పైననే ఎక్కువ యాధారపడి యుండుట కారణమైనది.

వరుణుడే గ్రీకుల "ఉరేనస్". ఇతడును ఆకాశమునకు సంబంధించిన వాడే; అయిన 'ద్యు' నుండి భిన్నుడు. 'ద్యు' ప్రకాశవంతమైన పగటి యాకాశమైన, వరుణుడు అంధకారముతో గూడిన రాత్రి యాకాశము. 'మిత్ర' శబ్దము కూడ పగటి కాంతి యుక్తమగు నాకాశార్థముననే వాడ బడినది. 'జెండా వస్త'లోని "మిథ్రా" శబ్దమిదియే. వైదిక విద్వాంసులు

‘మిత్రావరుణు’లను పగలు, రాత్రులుగ జెప్పుదురు. ఈరానీయులు ‘మిథ్రా’ను సూర్యుడనియు, వరుణుని యంధకారమనియు నందురు. జర్మనీ దేశపు ప్రఖ్యాత విద్వాంసుడు డా. రాథ్ ‘ఆర్యులు, ఈరానీయులు విడివడకముందు ఉభయులకును వరుణుడే పవిత్ర దేవతగా నుండె’నని యభిప్రాయ పడు చున్నాడు.

నీలఘనాళికి వేదములో ‘వృత్రి’ అను పేరొసంగబడినది ఎప్పుడును వర్షింపని మేఘములను ‘వృత్రాసురు’లని పిలచిరి. ఇంద్రుని వజ్రాఘాతంబున గాని ‘వృత్రుడు’ జలముల వదలడని పురాణములలో వర్ణింపబడినది. ఈ ప్రాకృతిక సన్నివేశము ఋగ్వేదమున మిక్కిలి యందముగ నభివర్ణితము. ‘ఈ యుద్ధమున వృత్రునిపై (నల్లమబ్బుపై) - జలపూర్ణమగు మేఘముపై నింద్రుడు వజ్రాయుధముచే ప్రహరించినప్పుడు (ఒండొంటినొరచుకొని మెరయగా) జలములచే నదీనదములు పరిపూర్ణములగును. ఈ యుద్ధమున ‘మరుత్తు’ (సురగాలి) ఇంద్రునికి బాగుగా దోడ్పడుచు మిక్కిలి గర్జించును.

ఈరానీ గ్రంథములలో ‘ఇంద్ర’ శబ్దము లేకున్నను ‘వేరేథఘ్న’ అను పేరువాడబడినది; ఇది నిజమునకు ‘వృత్రఘ్న’ శబ్దముయొక్క అపభ్రంశమే. ‘జెండావస్తా’యందు ‘అహి’, ‘థయేతను’ని వలసజంపబడినట్లు వ్రాసి యున్నది. పైబేర్కొనిన ‘వృత్రుడే’ ‘అహి’యైయుండ, ‘థయేతను’డే యింద్రుడు.

ఋగ్వేద సూక్తములలో ముఖ్యదేవతలగు ఇంద్రావరుణులను గురించి భిన్నరీతుల వర్ణనలు కలవు. ఇంద్రసూక్తిలో బలశక్తుల విశిష్టత గనుపించును. వరుణసూక్తులలో సదాచార భావము లెక్కువగ గన్పట్టుచున్నవి ఇంద్రుడు సోమపానము జేయునట్టి బలవంతుడగు దేవుడు, యోధుడు — మదించినవారి సాయమున నవావృష్టిలో యుద్ధమొనర్చును. అసురులచే జేయు యుద్ధములలో నార్యులకు సైన్యాధిపతియై నదీతీర భూములను త్రవ్వుటలో సాయముచేయును.

పూషణుడు ‘గోవుల’కు సూర్యుడు. నేడు హిందువులు విష్ణువును ముఖ్య దేవతగ బూజించుచున్నారు; నాడు వైదిక దేవతలలో సవిత్రాగ్ని

వరుణుల కన్నను తక్కువగ పరిగణింపబడు చుండెను. ఈ విష్ణు రూపుడగు సూర్యుని ప్రాతర్మధ్యందిన సాయంసమయముల యందాకాశమును తరించుటచే వేదము త్రివిక్రముడనియు, పురాణములును ప్రఖ్యాతమగు రూపము నొసంగియున్నవి.

'అగ్ని'ని వెనుకటి జాతులన్నియు నాదరముతో మన్నించినవి. ఈ దేవత పదేపదే ఘర్షణవలన కలిగింపబడు వాడగుటచే 'యవిష్ఠ' డనగా కనిష్ఠుడనియు 'ప్రమంథుడ'నియు పిలువబడెను. ప్రాచీనార్యేతర జాతులును అగ్నిని ప్రతిష్ఠించు చుండినవనుటలో నాశ్చర్య మిసుమంతయు లేదు. 'లాటిను'లో అగ్ని దేవతను 'ఇగ్నిస్' మరియు సాలవోనియనులు 'ఓగ్ని' [Ogni] అందురు. ఇదేవిధముగ 'ప్రమంథుని' 'ప్రొమేథియస్' భరణ్యుని' 'ఫోరోనస్' మరియు 'ఉల్క'ను 'వల్కెనస్' రూపములతో జూతురు.

అయిన ఋగ్వేదములో వివరింపబడిన అగ్నిభూమి పైనున్న సామాన్యాగ్నివలె గాక మెరుపు, సూర్యులై స్థలనిర్దేశము లేనివాడుగ నుండెను. భృగువాతని గుర్తించెను. మాతరిశ్వులాతని గ్రిందకు దెచ్చిరి. అథర్వణాంగిరు లాతని మనుష్యులకై పృథివిపై బ్రతిష్ఠించిరి. ఈ ప్రవచనములలో అగ్నిని గనిపెట్టుటకై చేసిన తొలిప్రయత్నములు జూపట్టుచున్నవి.

వేదములలో వాయువునకు కొద్దిపాటి మహాత్వమే కలదు. వాయు సూక్తములు తక్కువగ కలవు. సురగాలికి అభిమాన దేవతయగు 'మరుత్తు'డు స్మరణీయుడై యున్నాడు. ఇతడు భయంకరుడైనను, ఉపకారియై భూమాతస్తనములనుండి వృష్టిధారలను పిదుకుచుండెను.

రుద్రుడు భయంకరమూర్తి. అతడు మరుత్తుని తండ్రి. సాయన, యాస్కులతనిని 'అగ్ని' రూపుడనియే వచించిరి. భీకరముగ గర్జించు తుఫాను రుద్రుని రూపమని డా. రాథ్ పండితుని యభిప్రాయము. ఇతనిని గూడ వేదములలో విష్ణువువలెనే కనిష్ఠ దేవతగ పరిగణించిరి. ఈ దేవతను గురించి చాల తక్కువ సూక్తులు గలవు. పౌరాణిక యుగములో నతడు గొప్ప దేవుడయ్యెను. భీకరముగ రుద్రుని (తుఫాను) తో గర్జించుచు, మెరయుచువచ్చు కాళీ, కరాళీ మున్నగు పేళ్ళపనిమత్తులతో

వచ్చును. శ్వేత యజుర్వేదమున 'అంబిక' గణనకు వచ్చినను, పురాణములలో నీ దేవతలందరును రుద్రుని స్త్రీలుగనే యెన్నబడిరి. అయిన వేదములలో నెచటనైనను స్త్రీ దేవతా ప్రసక్తి లేదు.

ఇక యముని మాట; ఇతడును పురాణ ప్రసిద్ధుడు. ప్రయోగమున యముడు రవిపుత్రుడుగ పేర్కొన బడియున్నాడు. అయిన ఋగ్వేదములో నస్తమించుచున్న సూర్యుడు యముడుగ కల్పింపబడి యున్నాడు. మనుష్యుని జీవితమారంభమై యస్తమించునట్లు సూర్యుడుదయించి, వృద్ధి గాంచి, యస్తమించి లీనమగుచున్నాడని చెప్పబడినది. ఋగ్వేదానుసారము 'వివస్వతుడు'- (ఆకాశము) అతనితండ్రి. 'సరణ్యు' (ప్రభాతము) అతని తల్లి మరియు 'యమి' అతని చెల్లెలు.

ఈ ఘటనను గురించి ఋగ్వేదములో నిట్లు వర్ణింపబడినది. అన్న యగు 'యము'ని 'యమి' భర్తను కౌగలించునట్లా లింగన మొనర్పదలచినది. అయిన నతడొప్పలేదు. నిజమునకు 'యము,' 'యమి' యను పేళ్ళు రేపు, మాపులకే యివ్వబడి యుండినవి. అయినను రేయుంబవళ్ళొక దానినంటి నింకొకటి జుట్టుచుండుటయు, నవి కలువకుండుటయు జూచుచున్నాము.

ఋగ్వేదములో యముడు గతించినవారికి రాజు. పురాణములలో గూడ నింతవరకు సరిపోలుచున్నది. కాని ముందు మాటలు పొసంగుట లేదు. వైదికయముడు పుణ్యలోకమును జేరి సుఖించుచు, పితృదేవతలని పించుకొను నాత్మలతో గౌరవింపబడు చుండును. పౌరాణిక యముడన్ననో భయంకరములగు శిక్షల నొసంగుచు, కఠినుడుగ పాపులదండించు వాడునునై యున్నాడు. వేద సూక్తముల వినుడు—

1. వివస్వంత పుత్రుని సన్మానింపుడు. అందరు నతని చెంతకే పోయెదరు. పుణ్యాత్ముల నితడు సుఖ ప్రదములగు చోట్లకు జేర్చును.

2. మన పితరులు బోయిన మార్గముననే నందరు బోయెదరు. మనకు యముడెప్పుడును నశింపని తొలి మార్గమునే జూపెను.

సోమమొక మత్తుగలిగించు మొక్కయే యైనను నది యొక్క దేవత వలెస్తుతింప బడినది.

వివస్వత [ఆకాశము] 'సరణ్యు' [ప్రభాతము]ల నుండి యమి యములుద్భవించిరి. వారికి అశ్వినులను యమళులు బుట్టిరి. ఈ యశ్వినులును యమి యములవలె సంధ్యాప్రభాతములనుండి జనించిరి. ఋగ్వేదములోని యీయశ్వనీకుమారులు గొప్ప వెజ్జులు. వారికృపాపూర్ణములగు చికిత్సల నేక సూక్తములతో నభివర్ణితములు. వీరుభయులును దమ త్రిచక్రరథముపై నధిరోహించి ప్రతి దినము పుడమిని జుట్టుచు, దుఃఖితులకు వారికి జికిత్స లొనర్చుచుందురు.

ఋగ్వేద సూక్తములలో నున్న యొక అందమగు నలంకారమును జూడుడు—

1. పనిసుడిట్లనుచున్నాడు— ఓ సరమ, నీవిట కేల వచ్చితివి? ఈ ప్రదేశము మిక్కిలి దూరమైనది. వెనుకకు మరలి జూచువాడీ త్రోవనుండి పోజాలడు. నీవు దేనికై వచ్చితివో, మాచెంతనది కలదా? నీవెంత తిరిగితివి? రసానది నెట్లు తరించితివి?

2. నే నింద్రుని పంపున వచ్చితినని సరమయనుచున్నది. పనిసులార, మీరనేక పశువుల దాచి యుంచితిరి. వాటిని నే దీసికొందును. జలము నాకు సహాయపడెను. నేను రసానదిని దాటివచ్చితిని.

3. పనిసుడు— ఇంద్రుడు పంపగా నీవింత దవ్వు వచ్చితివి. ఆతడెట్టివాడు ఎవరివలె కనబట్టును? [పరస్పరము] రాసిమ్ము. ప్రీమతో మనమీమెను గైకొని, పశువుల నిచ్చివైతము.

4. ఇంద్రుని గెలచునంత వానిని జూడలేదు. ఆతడందరిని గెలచును. గొప్పనదులైన నతని నడ్డ జాలవు. పనిసులార, మీరు నిస్సందేహముగ నింద్రునిచే వధింపబడుదురు.

5. పనిసుడు- ఓ సుందరీ, నీ వాకాశమున చాల దూరమునుండి వచ్చియున్నావు. ఏలాటి జగడములు లేక, నీ కావసుల నిచ్చెదము. ఎవ డైన నిట్లుజేయునా మా చెంతనొక వాడియగు బాణము కలదు.

6. పనిసుడు- ఓ సరమ, ఇంద్రుడు మమ్ము భయపెట్టుటకై నిన్ని టకు బంపెను. మేము నిన్ను మా సోదరిగ గ్రహించుచున్నాము. నీవు తరలకుము. మా పశు సంపదనుండి నీకొక భాగమిచ్చెదము.

7. సరమ- మీరన్న చెల్లెండ్ర బాంధవ్యము నెట్లు తెచ్చితిరి. ఇంద్రాంగిరులకీ మాటలు తెలియును. పశువులన్నియు వశమగువరకు నేను వానిపై చూపు నిలిపెదను. మీరు దూరము పోయిపొండు. [ఋ.10,108]

ఈ చమత్కారమగు కథలో యంధకారమగు రాత్రి గడచిన తరువాత క్రమక్రమముగ విస్తరిల్లు ప్రకాశమును గురించి తెలుపబడినది. ఇంద్రుడు వెతుకుచున్న పశువులతో కిరణములు పోల్చబడినవి. వాటి వెదకుటకై యతడు సరమను పంపును. ఆమెయే 'ఉష'. సరమ అంధకార బంధురమగు 'విలు' లేక గహ్వరమును జేరును. పనిసుడే ఈ చీకటి. వాడామెను భ్రమ గొలుపును. అయిన సరమ మోసపోదు. అట నుండి యామె ఇంద్రుని చెంతకేగును అప్పుడతడామెను ప్రభాశాలినిగ జేయును.

ట్రాయ్ దేశపు యుద్ధకథనమీ వైదిక కథనాధారము జేసికొనియే వ్రాయబడియుండుననని మ్యాక్స్‌మూలరభిప్రాయపడుచున్నాడు. ఇది యనుదినమును పూర్వదిగ్భాగమున సూర్యునినుండి జరుపబడు యుద్ధమే, దీనిలోని ప్రకాశవంతమగు ధనమపరదిగ్భాగముచేసంధ్యా సమయమున నపహరింపబడుచున్నది కదా. మ్యాక్స్‌మూలరుగారియనుసారము 'ఇలియను' ఋగ్వేదపు 'విలు'యైయున్నది. 'పేరిసు' భ్రమగొలుపు వేదములోని 'పనిసుడు', 'హెలెనా' లాలసనుపేక్షించు సరమయైయున్నది. అయిన గ్రీకుపురాణములో నామె మోసగించుపబడుచున్నది.

ఆదితిపుత్రుడగు ఆదిత్యునిగురించి తెలిసికొందము అదితి అనగా అఖండమైనది, అపరిమితమైనది, అనంతమైనది. ఒక జర్మన్ పండితుని యను

సారమీశబ్దమున కర్థము- అనాది, అనివార్య మీశ్వరీయప్రకాశమునై యున్నది. ఈ యనంతములో- పృథ్వీ మేఘాకాశముల కవ్వలివస్తువు ద్యోతకమగుచున్నది. ఋగ్వేదములో నాదిత్యులను గురించి స్పష్టమగు వివరణమున్నది. మ. 2 సూ 27లో మిత్రావరుణులేగాక 'ఆర్యమత్' భగ' 'దక్ష' 'అంశు'లను గురించియు నుల్లేఖింపబడినది. మ. 9 సూ114 నుండి మ. 10 సూ 72లో నాదిత్యులసంఖ్య 7 అని తెలుపబడినది. ఇంద్రుడు అదితిపుత్రుడు. సవితృ సూర్యుడును ఆదిత్యుడుగనే పరిగణింపబడియున్నాడు. ఇదేవిధమున 'పూషణ' 'విష్ణువు'లును- ఇవిగూడ సూర్యుని పేళ్ళే- ఆదిత్యులు, తరువాత సంవత్సరము పన్నెండు మాసములలో విభజింపబడినప్పుడు ఆదిత్యుల సంఖ్యగూడ 12 అని స్థిరపడినది. భాష్యకారులును 'సవితృ'వని కదలుచున్న లేక కదలని సూర్యునిబిలచిరి. వాడు ప్రకాశించునట్టి సూర్యుని 'సూర్యు'డనిరి. సూర్యుని స్వర్ణకిరణముల యుపమానమును తమ స్వర్ణహస్తములనుండియే బ్రసాదించిరి. పురాణములలో సవితృడు యజ్ఞము చేయునప్పుడతని హస్తమొకటి దగ్ధముకాగా నచటనే బంగారు చేయి యొకటతికించబడినట్లు వర్ణనగలదు. అయిన నీకథయే జర్మను పురాణములలో కొద్దిమార్పులతో గన్పట్టుచున్నది. అచట సూర్యుని చేతి నొక పులి తిని వేసినట్లు వర్ణింపబడినది.

ఈ సవితృదేవతను గురించిన యొకేయొక పవిత్రమగు గాయత్రీ మంత్రముత్తరకాలపు బ్రాహ్మణము లలోనిదై యున్నది.

'తత్సవితృవరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః : ప్రచోదయాత్'. 'డా. విల్సన్ దీనికిట్లర్థము వ్రాసియున్నాడు-

''మమ్ము పవిత్రకర్మలలో ప్రవృత్తులజేయునట్టి యాదివ్యుడగు సవితృని మనోహరమగు ప్రకాశమును ధ్యానింతుము'' [3-62-10]

బృహస్పతి- లేక బ్రహ్మణస్పతి ఋగ్వేదములో నొక సామాన్య దేవత ; అయిన నుపనిషత్తులలో నరుదుగ నతడు 'బ్రహ్మన్' అను గొప్ప బిరుదును బడసియున్నాడు. అతడే బౌద్ధమతములో 'నుపకారిబ్రహ్మ' గను పౌరాణిక జగత్తున రచయితా 'బ్రహ్మ'గను భావింపబడినాడు. వైదికబ్రహ్మ

విష్ణుపదుగ్రులు, గంగోత్తరిచెంత సన్నగా ప్రవహించు పవిత్రగంగా జలములు సాగరసంగమ ప్రాంతమున విస్తీర్ణతను బొందినట్లు పౌరాణిక దేవతాత్రయముగ మిక్కిలి వ్యాప్తినిగాంచిరి.

ఋగ్వేదములో స్త్రీదేవతలను గురించి యన్నినో ఒక 'ఉషా', 'సరస్వతు'లే కలరు. 'సరస్వతి' తొలుత నదిగా వ్యవహరింపబడినట్టిది తరువాత వాణ్యభిమాని దేవతయైనది. 'ఉషస్సు' లేక ప్రభాతమును గురించిన వర్ణనను బోలు మధురమైన కవిత్వమెందును, నెరిసైన గురించియు వినము. ఆలకింపుము—

20. 'మా ప్రార్థనలపైననురాగముగల ఓయుషామర సుందరీ! నీవెవరిపై దయజూపెదవు?'

21. వివిధవర్ణములతో ప్రకాశించుచున్న ఉషా, నీప్రభలు సుదూరము విస్తరిల్లినవి. నీయునికి యెద్ది చెప్పుమా?

22. ఓ ఆకాశపుత్రీ! ఈ నివేదనముల స్వీకరించి మా సుఖములను చిరంతనముండునట్లొనర్పుము. [1-30]

7. యువతియగు నాకాశపుత్రి, శ్వేతాంబరధారిణియై విశ్వసౌభాగ్యమునకు స్వామినియైయున్నది. మాకామె ప్రకాశమునిచ్చుచున్నది. ఓ వినిర్మల ఉషా మాకిట ప్రకాశమిమ్ము.

8. ఏమార్గమున లెక్కకు మిక్కిలి ప్రభాతములు గడచెన్నవో, ఆపథమున ననంతములగు ప్రభాతములు రాబోవునో అట్టి త్రోవలో తేజస్సంపన్న యగు నుష అంధకారమును బోద్రోలుచు, మృతప్రాయులై బడియున్న ప్రాణికోటిని తన యమృతమయహస్తముల దట్టుచు మేల్కొలుపుచున్నది.

10. ఉషోదయ మెప్పుడైనది. మరియుం నెంతవరకగుచుండును. నేటి ప్రభాతమా గడచిన వాటికి తరువాతను, వచ్చునట్టిదదీనిని వెంబడించునట్టిదిగ నున్నది. [2-113].

11. ఓ మంగళమగునుషా! నీ తల్లి చేతులతో శృంగారింప బడి వధువువలె శోభాయమానవై గను పట్టుచున్నావు. ఈ క్రమ్మిన చీకటులను తొలగింపుము. నీకన్న నితరులెవ్వరు నీ పనిని చేయజాలరు. [1-123]

ప్రాచీన జాతులవారిలో నీయుష మిక్కిలి పేరెన్నిక గన్నది. యవన ప్రాంతములలో 'ఉషస్సు' 'ఇయోస్' [ Eos ] అనియు, లాటినులో 'అరోరా' [ Aurora ] యనియు పిలువబడినది. 'అర్జునీ' యను నది యవనుల భాషలో 'ఆర్జినోరిస్' [ Argijnoris ] గా నున్నది. 'వృసయా' గ్రీకుల [బ్రిసేయిస్] [ Briseis ] మరియు 'దహనా', 'దఫనే' [ Dophne ] అయినవి. 'సరమ' గ్రీకుల 'హెలెనా' [ Helena ] అయినది.

'సరస్వతీ' యనునదొక నది. దీని తటమునసే ప్రాచీనార్యులు చిర మధివసించిరి. సహజముగా నాదేవి సూక్తముల దేవి కాదు. అమెయే పౌరాణిక యుగమున వాణ్యభిమాని దేవతగా మారినది. ముందు నుందీవిషయ ముల్లేఖింప బడును.

ఆదికాలమున నార్యులు ప్రకృతిని పరిచయమొనర్చుకొని నన్లెల్ల దాని గుణగణములను సహజసుందర కవితారూపమున గాన మొనర్చుసాగిరను విషయము పై నుదహరింప బడిన వైదిక దేవతల వర్ణనలనుండి విద్వల్లోకము గురుతింప గలదు. ఈ కల్పనలనుండి వారెంత సహజస్వభావులై నదియు, సదాచారులైనదియు సందేహింపక తెలియనగుచున్నది. ఈ సూక్తముల నుండి తెలియునదేమన నేలాటి క్రూరస్వభావము కల దేవతయు నటనభివర్ణింపబడలేదు. ఏలాటి హీనములును, నీచములు నగు మాటలకెందు నెడ మీయలేదు. ఈ సూక్తముల నుండి విశ్వవిస్తృతమగు నీతి ప్రకటిత మగుచున్నదని చెప్పుటలో నభ్యంతర మేమియు లేదు.

ఋగ్వేదములో నే దేవతను గురించిన పూజ కాని, మందిరము కాని, ఉపాసన కాని యున్నట్లుల్లేఖింప బడలేదు. దీనివలన గృహపతి తన యింటి లోనే యగ్ని కార్యముల జేయుచు, ధనధాన్యాధికముల వలనను, బంధు మిత్రాదుల వలనను సుఖ మొనగూర్చు నట్లీ యా దేవతలను గీర్తించుచుండె

ననుట స్పష్టమగుచున్నది. నాటి ఋషులు సాంసారిక జీవనములు గడపుచు పశు ధాన్య సంపదలతో దులదూగుచుండిరి. వారివి గొప్ప కుటుంబము లుండెను. నల్లనియనాగరకులనుండి తమ జాతిని రక్షించుకొనుటకై వారు తమలో గల వైషమ్యముల మాటటుంచి బాణ, బల్లెముల గొని శత్రువుల నెదిరించు చుండిరి.

ఇట్లైనను యోధుడు, పురోహితుడు, కృషీవలుడు అను భేదము లేక ప్రతివాడును యీ మువ్వురి గుణములను కలిగియుండెను. అయిన ఋగ్వేదపుటుత్తర కాలపు సూక్తములలో పురోహితులు పలుతావులందు వ్యవసాయ దృష్టి చేత పౌరోహిత్యమును నడపుచు దక్షిణలగొనిన యుదాహరణములు బెక్కులు గలవు. వీరిని గురించి ముందు వివరింపబడును. కొన్ని కుటుంబముల వారు సూక్త మంత్రముల ద్రష్టారలుగ నగుపించుచున్నారు.

ఈ ఋషులలో వశిష్ఠ విశ్వామిత్రు లుత్తములు. వీరిని గురించిన యనేక గాథలను డా. మ్యూర్ తన 'సంస్కృతీ టెక్స్టస్' అను గ్రంధమున సంగ్రహ పరచి యున్నాడు. వీరుభయులకును విద్వేష ముండినది. వశిష్టు డెటకో పోయినప్పు డతని యజమానుడగు సుదాసుని యజ్ఞమును విశ్వామిత్రుడు చేయించెను. వశిష్టుని శిష్యులీ సంగతి దెలిసి విశ్వామిత్రుని దూలనాడి, తమ గురువుగారి కెరిగించిరి. విశ్వామిత్రుడు రాజర్షియై బ్రహ్మర్షిగా మారుటయు, భృగువంశ పక్షపాతి యగుటయు వీరి ద్వేషమునకు గారణమై యున్నది. ఋగ్వేదములో మం 3 సూ 53 లో వశిష్టు నెట్లు దూలనాడిరో కొంత యాలకింపుడు.

,,వాశిమొనర్చువాని శక్తి గోచరము కాదు. ఋషులను జనులు పశులవలె బిక్కరించి చూచెదరు. బుద్ధిమంతులు పెద్దలను దూషించుటకై సిద్ధపడరు. వారు గుఱ్ఱముల ముందు గాడిదలను సాగనివ్వరు.,, [23]

,,ఈ భారతీయులు (వాశిష్టులతో) కలిసిమెలసి యుండుట యెరుగరు. ద్వేష మొనర్ప నేర్చియున్నారు. వారు తమ శత్రువుల యెదుట గుఱ్ఱముల నుఱికింప జాలుదురు, ధనస్సుల బూని యుద్ధమొనర్తురు.'' [24]

వశిష్టుడు మం 7 సూ 104 లో ,,సోమరస్తులకు మేలు కలుగదు. ఏలన వారు తమ సామర్థ్యమును వృధాపుత్తురు. అది యీ యనృతవాదుల నష్టపరచని. మేముభయులము ఇందు్రిని యర్ధనము'' అని దువాచ్యములకు బదులిచ్చి యున్నాడు. [13]

,,నే నాతుధానుడనే నైయుండిన లేక నెవరికైనను దుఃఖము కలిగించి యుండిన నిప్పుడే చత్తును గాక. అట్లుగాక నెవడేని నన్నాతుధానుడని యనృతము లాడియుండిన వాడే తన బంధువుల నడిమినుండి విడి వడి పోవు గాక. [15]

,,నేనాతుధానుడ గానప్పుడు నన్ను నిందించిన వానిపై ఇందు్రిని వజ్రాయుధము పడుగాక,, [16]

వేదకాలములో జరిగిన యీ విద్వేషమునకు పురాణములలో వన్నె పెట్టబడినది. పురాణ గాథలలో క్షత్రియుడగు విశ్వామిత్రుని బ్రాహ్మణుడైనట్లు చెప్పబడినది. అయిన ఋగ్వేదములో బ్రాహ్మణుడనికాని, క్షత్రియుడని కాని చెప్పబడలేదు. మొదలితడు యోధుడగు ఋషియై తరువాత పురోహితుడగు ఋషియైనట్లభివర్ణితము. ఋగ్వేదములోగల విశ్వామిత్రుని పెక్కు సూక్తులలో ఆధునిక బ్రాహ్మణములలోని సావిత్రీసూక్తము– గాయత్రి– యొకటైయున్నది. అతడు క్షత్రియులలో పుట్టెనని తలచి మహాభారత, హరివంశ, విష్ణు పురాణములలో బ్రాహ్మణుడుగ మారిన యద్భుతకథలు వ్రాయ బడినవి. ఇదిగాక హరిశ్చంద్రుని కథలో నితడు కోపి, క్రూరుడు, నిష్ఠురవాది, లోభియునగు ఋషిగా వర్ణింప బడియున్నాడు.

త్రిశంకుడను రాజు భౌతిక శరీరముతో స్వర్గమును చేరదలచి వశిష్ఠునితో చెప్పికొనెను. అందులకు వశిష్టుడు అట్లుజరుగుటసంభవమని పలుకగా విశ్వామిత్రుడు తప్పక జరుగునని మాటయిచ్చెను. ఈ మాటకు వశిష్ఠుడు కోపగించుకొని యతనిని చండాలునిగ చేసివైచెను. అయినను విశ్వామిత్రుడు యాగముచేసి యతనిని స్వర్గమునకు బంపెను. ఇందు్రిడతనిని స్వర్గమునుండి గెంటివైచెను. అదిచూచి విశ్వామిత్రుడతనినచటనే నిలిపి యతనికై ప్రత్యే

కముగ స్వర్గమును సృజింప మొదలిడెను. ఇది పౌరాణిక గాథ. ఇదేవిధముగ పెక్కుకథలల్లబడినవి. ఇట్టి కథలలో కాల క్రమముగూడ పాటింపబడలేదు. అనేకతరముల వరకు వసిష్ట విశ్వామిత్రుల వంశములవారు కలహించుచునే యుండిరి.

ఋగ్వేదపు 9వ మండలములోని ఋషియగు నంగిరుని గురించి విష్ణుపురాణము [మం 4. 2. 2.] లో నభాగునకు నాభాగుడు, అతని కంబరీషుడు, అతని యందు విరూపుడు, ఇతనికి పృశదశ్వుడు, ఈ పృషదశ్వునకు రథీవరుడు కలిగిరి. ఇది క్షత్రియులుగ మారిన యంగిర వంశము.

వామదేవ, భారద్వాజాదులు మత్స్య పురాణము [అ 132] లో బ్రాహ్మణులుగ మారిన నంగిర వంశములోని వారని వివరింపబడిరి.

కృత్సమదుడు మొదట అంగిర వంశమున నుండి తరువాత భృగు వంశము లోనికి మారెనని సాయణుల మతమైయున్నది. అయిన విష్ణు, వాయు పురాణములలో గృత్సమదుడు సేనకు పితయైనట్లును, వర్ణవ్యవస్థల జేసినట్లును వ్రాయబడినది [వి.4-8]

కణ్వుని గురించి విష్ణుపురాణములో [4-19]ను, భాగవతములోను [4-20] గురుసంతానమని వ్రాయబడినది. వీరు క్షత్రియులైనను బ్రాహ్మణులుగ నెంచబడు చుండిరి. అజమీఢునినుండి కణ్వుడు, అతనికి మేధాతిథి జన్మించిరి. వీరినుండి కణ్వనయ [కాన్యకుబ్జ] బ్రాహ్మణులు గలిగిరి. [వి. పు. 4-19]

విష్ణుపురాణములోన త్రిఋషి పురూరవసుని పితా మహుడుగ పేర్కొన బడెను [వి. పు. 4-6] మత్స్య పురాణము [అ 132] లో 91 సూక్త కారుల వర్ణన కలదు. అయిన నాధునిక పురాణములలోని వర్ణనలు నిజమున కంత ప్రామాణికములై, వాటిపైననే యధార పడవలసినంత స్థితిలో లేవని చెప్పవచ్చును. పురాణములు ఋషులను ముత్తెగలుగ విభాగించినవి:- దేవర్షులు- నారదాదులు, బ్రహ్మర్షులు- వశిష్టాదులు, రాజర్షులు- జనకాదులు, అయిన వేద ఋషులే విభాగమునకు వేరుగనుండిరి. ఆ కాలమున

నీ శ్రేణు లేర్పడ నేలేదు. ఇట్టివర్ణనల మూలమునసే ఋగ్వేదము నందలి ఈ విషయములను బడయ గలుగు చున్నాము.

1. నదులు :- సుమారిరువదైదు కలవు. వీటిలో మూటిని వదలిన తక్కినవి సింధునది శాఖలే. 1. వితస్థ 2. అసిక్ని (చంద్రభాగ) 3. ఉపరూష్ణి [రావి] 4. విపాటు 5. శుతద్రీ [సతలజ] 6. కుభా 7. సువాస్తు 8. క్రము 9. గోమతి 10. గంగ. 11. జమున 22. సరస్వతి 13. సింధు 14. దృషద్వతి 15. రసా 16. సరయూ 17. ఆంజం 18. హులిసీ 19. వీరపత్నీ 20. సుశోభా 21. మరుద్వృధా 22. అర్జికీయా [విపాశ] 23. తృష్టామా 24. సుసర్తు 25. శ్వేతి 26. మేహత్నులు.

2. పర్వతములు- 1. హిమవంతము [హిమాలయము] మూజవతము [సోమలత పుట్టుచోటు. కాబూలు చెంత కాశ్మీరమునకు నైఋతిలో గలదు] 3. త్రికకుత్ 4. నావాప్రభ్రంశనము.

3—

4— పశువులు- సింహ. గజ. వృక, వరాహ, మహిష. ఋక్ష, వానర మేషాజములును, గోగార్ధభాశ్వోష్ట్రములను గురించియు.

5— పక్షులు- హంస, క్రౌంచ, చక్రవాక, మయూరాది ప్రభృతము లును.

6.— ఖనిజములు బంగారు, వెండి, ఇనుము మున్నగునవి.

7— మనుజాతివర్గములు :- గాంధారులు, మూజవతులు. పంచవర్గియులు, పంచజనులు, పూరవులు, తుర్వసులు, యదు వంశీయులు, అనవులు, దుహ్యవులు, మాత్స్యులు, సృంజయులు, ఉశీనరులు, చేదీయులు, క్రివియులు, భారతులు, క్రీవయులు.

8— ఆభరణములు :- కటక, కుండల గ్రైవేయ, నూపురాదులు.

ఋగ్వేదభాష్యమును రచించిన సాయణాచార్యుల తరువాత దయానంద సరస్వతీ భాష్య మెన్నతగినది. ఇతడు సంస్కృతమున నహార

పాండిత్యమును గడించి, వైజ్ఞానిక దృష్టితో వేదముల దిలకించి బ్రహ్మవాది ముతావలంబియై, వేదకాలమును 196 కోట్ల 8 లక్షల 52 వేల 9 వందల 84 సంవత్సరము అని [తనకాలమునకు] చెప్పియున్నాను. ఇది సృష్ట్యాది కాలమని ఇతని యభిప్రాయము.

ఇతని యభిప్రాయ ప్రకారము ఋగ్వేదవిషయ, స్థలములను గురించి సంకేత మాత్రముగ నిచట వివరింప బడుచున్నది.

బ్రహ్మవిద్యా, ధర్మాదికములు— 1. 6. 15. 5, 1. 2. 7. 5. 8. 8. 49. 2-3-4,

సృష్టివిద్యా— 8. 7. 17, 8. 7. 3,
పృథివ్యాదుల పరిభ్రమణము :— 8. 2. 10. 1, 4. 13, 3,
గణితము — 8. 7. 18. 3,
ఈశ్వరస్తుతి— 1. 3. 18. 2,
ఉపాసనము— 4. 4. 24. 1, 1, 1. 11. 1,
ముక్తి— 8. 2. 1. 1,

వైమానిక విజ్ఞానము— 1. 8. 8. 3, 4, 1. 8. 8. 5, 1. 8. 9. 1. 1. 3. 4. 1, 1. 3. 5. 7, 1. 3. 34. 7, 1. 6, 9. 4, 1. 3. 34. 7, 2. 3. 23. 47, 2. 3. 24. 48.

తారవిద్య— 1. 8. 21. 10,
పునర్జన్మము— 8. 1. 23. 6—7,
నిరోగము— 7. 8. 18. 2; 10. 18. 8. 8. 5. 27. 20,
రాజధర్మములు— 3. 2, 24. 6, 1. 3. 18. 2,

చాలామట్టుకు ప్రాచీనర్వాచీన భాష్యకారులను దయానందుడు విమర్శించెను. ఇట్టి భాష్య కారులలో సాయణాచార్యులు, మహీధరుడు ముఖ్యులు. అయిన శతపథాదిక బ్రాహ్మణముల విషయమున దయానందుడు మౌనము వహించుటాశ్చర్యముగ నున్నది.

# యజుస్సామాధర్వణములు

మహీధర సాయణాదులు యజుర్వేదమును సంపూర్ణ యజ్ఞాధారమని స్వీకరించిరి. ఋగ్వేదములో నందందు లభించు వివిధ నామములు విభిన్న యజ్ఞకర్తల నామములై యున్నవి. అధ్వర్యునకు యజ్ఞములో భూమిని గొలుచుట, యజ్ఞకుండమును నిర్మించుట, జలకాష్ఠముల సంగ్రహ మొనర్చుటలు విధియై యున్నది. ఉద్గాత పాడుచుండెను. వీనిని ఋగ్వేద ములో ,,యజుష్'', ,,సామన్'' అను పేళ్లతో బిలచిరి. ఈ మాటలను వివరించు సూక్తములు గల ఋగ్వేదభాగము తరువాతిది. అంతకు ముందున్న నాగరకతనే యవి ప్రకటించుట సహజము. కావుననే ఇంద్ర, మిత్రా వరుణోపాదుల వర్ణనలు దీనిలో గాననగును.

కృష్ణయజుర్వేదము, తిత్తిరిపేరున తైత్తిరీయ సంహితయన బరగును. ఈ వేదపుటాత్రేయుని ప్రత్యను క్రమణికలో ,,నీవేదము వైశంపాయను నుండి యాస్కునకును, నతనినుండి తిత్తిరికి, తిత్తిరినుండి యుఖునకు నతని నుండియాత్రేయునకు ప్రాప్తమైనది.'' ఈ పరంపరను వర్ణించు యజుర్వేద ప్రతి మూలప్రతి కాదని మా:యభిప్రాయమై యున్నది.

శుక్ల యజుర్వేదము యాజ్ఞవల్క్య వాజసనేయనామముతో 'వాజస నేయ సంహిత' యనబడును. యాజ్ఞవల్క్యుడు విదేహరాజగు జనకుని సభలో ప్రసిద్ధ పురోహితుడుగ నుండెను. ఇతడే తన పేరిట నొక శాఖను విస్తరిల్ల జేసెను.

యజుర్వేదపు రెండు ప్రతులలో కృష్ణయజుర్వేదమున యజ్ఞ సంబంధము అగు మంత్రములు వ్యాఖ్యలతో వివరింప బడినవి. యజ్ఞావ శ్యకములగు వర్ణనలును, రెండవదానిలో — శుక్లయజుర్వేదమున- కేవల మంత్ర ములును, వాటికి సంబంధించిన వ్యాఖ్య వర్ణనాదికములు ప్రత్యేకమగు బ్రాహ్మణమున వివరింపబడినవి. ఈ బ్రాహ్మణమును 'శతపథ బ్రాహ్మ ణమందురు. దీనివలన యజుర్వేదపు పూర్వాచార పద్ధతిలో యజ్ఞప్రియు డగు యాజ్ఞవల్క్యుడొక క్రొత్త పరిశోధనజేసి పరివర్తనాకాలమున నూతన సాంప్రదాయము నొకదాని నెలకొల్పినను విషయము తెలియుచున్నది.

శుక్లయజుర్వేదములో 40, కృష్ణయజుర్వేదములో 18 అధ్యాయములున్నవి. శతపథ బ్రాహ్మణములో నా 18 అధ్యాయముల మంత్రములు 9 ఖండములలో సంపూర్ణమొనర్పబడి యథాక్రమముగ టిప్పణములీయబడినవి. ప్రాచీన కృష్ణయజుర్వేదపు యీ 18 యధ్యాయములను యాజ్ఞవల్క్యుడుద్ధరించి సంకలన, సంస్కారములజేసెను. తక్కిన 7 అధ్యాయములు యాజ్ఞవల్క్యుని అనంతరము సంకలితమగుచుండెనేమో, మరియు కడపటి 15 అధ్యాయములు ఖిలి పరిశిష్టములను పేర్లతో తరువాత ప్రసిద్ధములైనవి.

యజుర్వేదమున 101 శాఖలు గలవు. ఈ శాఖలు శైలి, అధ్యాపన, దేశభేద కారణమున నైనవి. వీనిలో చాలా విలుప్తమైనవి, గురువు నుండి నేర్చినవిద్యను శిష్యుడు తన దేశమున తన శిష్యులకు బోధించినప్పుడు గలిగిన భేదములను పాటింపక నదేరూఢికాగా నాశాఖ కాతని పేరీయబడెను. కొన్ని శాఖలలో పరస్పరము భేదమేర్పడి పైజెప్పినట్లు యజుర్వేదము రెండు పేర్లను కలిగియున్నది. శుక్ల [శ్వేత] యజుర్వేదపు వాజసనేయీ సంహితచాలా ప్రసిద్ధమైనది. వాంసనేయీఋషి వివిధ దేశముల 18 గురు శిష్యులకు యజుర్వేదమును బోధించెను. ఆ పదునెనమండ్రుగురి పేరిట 18 శాఖలైనని. శాఖా భాష్యకారులు వీటి నూతగా గొని మూల యజుర్వేదపు శుద్ధస్వరూపమున పరిగ్రహించిరి. ఈ శాఖకు సంబంధించిన బ్రాహ్మణముపలబ్ధము.

షడశీతిః శాఖా యజుర్వేదస్య చరణవ్యూహః

సామవేదమునకు సంబంధించిన విశేషమేమియు చిక్కుటలేదు. కొన్ని ఋచలను వదలిన తక్కినవన్ని ఋగ్వేదములో లభించును. ఆ మిగిలిన ఋచలు గూడ ఋగ్వేదములోనివే నేమో? బహుశః ఇప్పుడవి విస్మరింపబడినవి. సామవేదము ఋగ్వేదమునుండి గాయనమునకై స్వరతాళబద్ధముగ జేయబడి, సంగ్రహింపబడినది. దీనికన్న వేరు కారణమేదియు గోచరింపదు. ఈ భేదములోని గొన్ని మంత్రములు యజుర్వేదమునను అథర్వణ వేదమునను గావబడును.

అథర్వణవేదము కేవలమాధునికము. మనుస్మృత్యాదులు మూడు వేదములను మాత్ర ముదాహరించును. కాషీతిక 6. 10. ఐతరేయ బ్రాహ్మణము 5-32, శతపథ బ్రాహ్మణము 11. 5. 8, 14. 6. 10.6, ఛాందోగ్యోపనిషత్ 4. 17, ఐతరేయారణ్యకము 3.2.3, బృహదారణ్యకము 1. 5 లో మూడు వేదముల నామములుల్లేఖింపబడి, యిది 'అథర్వాంగిరేతిహాస'మని లెక్కింపబడినది. ఈ గ్రంథమును వేదమనుటకు దీనికి సంబంధించిన బ్రాహ్మణోపనిషత్తులలోనే యాధారములు కలవు. పైజూపిన యాధారముల తోడ్పాటుతో క్రీ. పూ. 1500 నుండీ గ్రంథము అథర్వాంగిరేతిహాస రూపమున ప్రకటనమగుచుండినది. అప్పుడప్పుడద్దానిని 'అథర్వణవేద'మని పిలుచుటకు పలువురు నిశ్చయించినను క్రీస్తు తరువాతను నదివేదమన బరగదయ్యె. 'గోపథ' బ్రాహ్మణము నాలుగవ వేదమావశ్యకమని తర్కముచే సిద్ధముచేయుచున్నది. అది 'శకటమునకు నాలుగు చక్రములుండును, పశువునకును నాలుగు కాళ్ళుండుటచే నది నడచును. ఇదేవిధమున యజ్ఞకర్మలును నాలుగు వేదములు లేనిది జరుప బడువు'. ఇట్లనుటచే గోపథము వరకును 'అథర్వణము' వేదముగా స్వీకరింప బడలేదని తెలియును. ఒకచో గోపథము అథర్వణమెట్లు వేదమైనదని ప్రశ్నించును.

అథర్వాంగిరుల నామవర్ణవాదికములు పురాణములలో మన కగుపడును. ఈ యుభయవిద్వాంసులు ఈ గ్రంథముకు సంకలింత మొనర్చిరనుట పొసగుచున్నది. ఈ వేదములలో 20 కాండములున్నవి. వాటిలో 6 వేలఋచలుగలవు. దీని యారవయంశము గద్యమునను తక్కినదాని యారవ యంశము బహుశః ఋగ్వేదపు 10 వ మండల సూక్తములతో సరిపోలుచున్నది. 19 వ కాండ దానికి పూర్వపు 18 వ కాండకు పరిశిష్టమై యున్నది. 20 వ కాండ ఋగ్వేదపుటుద్ధరణ మైయున్నది.

ఈ గ్రంథమెంత క్రొత్తదైనను, దీనిలో నొక ప్రబలమగు వైజ్ఞానిక వాదమును మనము గాంచెదము. అనేకముఖ్య విజ్ఞాన విషయములు దీనిలో మనకులభించును.

**శ్వాసోచ్ఛ్వాస-విజ్ఞానము** :— శ్వాసోచ్ఛ్వాసములు రెండును వాయువులు. పీల్చబడినది శ్వాసః ఇది బలమునిచ్చును. విడువబడినది యుచ్ఛ్వాసః ఇది దోషముల తొలగించును. ఈ రీతిగ దోషముల బోగొట్టి బలము కలిగింపబడుటచే ప్రాణులు జీవించును. ఋ. 10. 137. 2

**నిర్మల వాయువు** :— శుద్ధమగు వాయువు రుగ్ణతలను బోగొట్టుటలో దివ్యౌషధము. అది హృదయమునకును, మనసునకును శాంతి కలుగ జేయును. ఆనందోత్సాహములు దీనినుండియే సంప్రాప్తములు. దీన దీర్ఘాయువు గలుగును. ఋ. 10. 18. 1

**దీర్ఘాయురహస్యము** :— ఓ ప్రాణనీతీ! నేయిద్రావి, వెలుతురులోనుండి సూర్యుని దర్శించి మేము నిన్ను రక్షించెదము. మామనములు దీర్ఘ జీవితమునకై దృఢములౌ గాక. ఋ. 10. 59. 5

**దుగ్ధపానము** :— అప్పుడే పితికిన ఆవుపాలు శ్రేష్ఠములు. వేడి యారని పాలు మిక్కిలి మంచివి. పగటి భోజనమున పెరుగు వాడుటయు, నుత్తమ పురుషార్థమును సాధించుటయు పురుషుని లక్షణములు.
ఋ. 10. 178. 2

**దానము** :— దుర్బలునకు, రోగికి, బిచ్చగానికి అన్నమిడువాడు నిజమగు భోక్త. అతని చెంతతగినంత ధాన్యముండి, యన్నమునకు గొరతలేక నాపదలనుండి రక్షించుచుండును. ఋ. 10. 117. 3

**గుణత్రికయి** :— మైత్రి, న్యాయము, వీర లక్షణములను మూడు గుణములను మనుష్యునకుండవలయును. ఋ. 10. 185. 1

**దారిద్ర్యమును నశింపజేయుడు** :— ఓ ధనహీన విరూప, కురూపీ, సదారోదన మొనర్చు దారిద్ర్యమా! నిర్జన పర్వతాగ్రమునకేగుము. అట్లు గానిచో వజ్రమునుబోలు దృఢమనస్సుగల పరాక్రమవంతుని సాయమున నిన్ను నశింపజేయుదుము. ఋ. 10. 175. 1

**కర్మకుశలుడు దారిద్ర్యమును బోగొట్టును :—** పనిలో నేర్పుగలవాడు దారిద్ర్య సముద్రము నవలీలగ దాటును. కావున కర్మకుశలురుగండు.
ఋ. 10. 255. 3

**ఇనుమును వాడుట :—**ఇనుమునకు సంబంధించిన కర్మాగారములు విరివిగా దేశమున స్థాపింపబడి పని జేయునప్పుడు ఐశ్వర్యమునకు శత్రువగు దారిద్ర్యము నీటిబుడగలవలె క్షణములో నశించును.
ఋ. 10. 155. 4

**ద్యూతపరిణామము :—**నాభార్య నాకెప్పుడును శ్రమగలిగింపక తన బంధుజనులతో గూడ నన్ను ప్రేమించుచుండెడిది. నేనీజూదముకలన నామెను వదలవలసివచ్చెను.
ఋ. 10. 34. 2

ద్యూతమెవని జ్ఞాన, ధనము లపహరించునో వాని యోషను నితరులు పభోగింతురు. తలిదండ్రు లన్నదమ్ములను వానిని గురించి తెలియదనియు, వానిని గట్టి గొంపొండనియు నందురు.
ఋ. 10. 34. 4

ఈ పాచికలు నీచములైనప్పటికిని యుచ్ఛములై. చేతగానివైనప్పటికిని బలవంతుల నోడించును. పలకపై విసరబడిన యీ పాచికలు నిప్పులవంటివి. చల్లగా నున్నప్పటికిని హృదయముల మాడ్చివేయును.
ఋ. 10. 34. 9

ఒరుల ధనధాన్యములను, స్త్రీలను జూచి జూదరి సంతసించును. వాడు తొలుత తనకుగల సర్వస్వమును బోగొట్టుకొని యిపుడు చలిమంటల తోరాత్రుల బుచ్చును.
ఋ. 10. 34. 11

**పురుషార్థకర్మ :—**ఈ లోకమున నెప్పుడు బని చేయుచు నూరేండ్లు జీవింపుము. ఇదే నీకొక మార్గము. కర్తవ్యపరాయణుడగు వానికి దోషములంటవు.
య. 40. 2

**ఈశ్వరునకు ప్రతిమ లేదు :—**ఎవని నామము ప్రసిద్ధమైనదో వానికి ప్రతిమలేదు.
య. 32. 3

వానికన్న ముందేదియులేదు. వాడేయన్ని భువనములను సృజించెను. వాడుబ్రజాపతి, ప్రజలగూడి యుండువాడు, షోడశకలాపూర్ణుడై మూడు తేజముల ధరించును. య. 32, 5

**33 దేవతలు :**—ఎవని దేహములో 33 దేవతలు వసింతురో వానిని బ్రహ్మజ్ఞానియే కనుగొనును. అ. 10. 7-27

**రాష్ట్రమున వర్ణోన్నతి :**—ఓ బ్రాహ్మణుడా, మారాజ్యములో జ్ఞానులగు బ్రాహ్మణులును, శూరులగు క్షత్రియులు నుందురుగాక. సమృద్ధిగ బాలుపితుకు నావులును, చపలాశ్వములును, విదుషీమణులు నుండి, యజ్ఞకర్తలకు శూరులును, విజయులును, సభానురంజకులగు పుత్రులుందురుగాక, సకాలమున మేఘములు వర్షింపనిమ్ము; వనస్పతులు ఫలభరితములగుగాక. య. 22. 22

**కర్ణవేధ :**— అశ్వినీ కుమారులినుపసూదితో, బహు ప్రజాసూచకముగ, చెవులగుట్టినట్లే, నీవుగూడ గర్ణవేధ నొనర్పుము. అ. 6. 142

**వాణిజ్యము :**—దేవతలారా! మూలధనముతో ధనము నపేక్షించు నేను వ్యాపారమును జేయుచున్నాను. అదినాధనమును తరుగులేక పెంచుగాక. అ. 3. 15

నేను వ్యాపారము జేయునట్టి ధనమధికమగుట నాకిష్టము.

**కపోతసందేశము :**—సైగచేసి యెగుర వేయబడిన పావురము మాచెంతకు వచ్చినది. దీనిని సత్కరించి, మరలింపయత్నింతము. అ. 10. 1. 5. 1

**పాలు, నేయి :**—ఆవులనుండి పాలు బితికెదను. నేయి నుండి బలవర్ధకములగు రసముల సేకరింతును. పాలునేతులనుండి మా వీరులు దృప్తులౌదురుగాక, మాచెంత గొన్నియావులుండనీ. అ. 2. 26. 4

**గృహస్థు** :—మా యింటిలో పాలు, నేయి, ధాన్యములు, భార్య, వీరపురుషులు, రసములున్నవి. అ. 2. 16. 5

**ఋణనింద** :—ఇహపరలోకములలో నెవరికినీ మేము ఋణపడకుందుముగాక. అ. 6. 117. 3

**నౌకా వర్ణనము** :—ఉత్తమరక్షా సాధనములుగలదియు, విస్తృతమును, నఖండమును, పూర్ణమును, సుఖప్రదమును, సుగమమును, దివ్యమును, అందమగు చుక్కానులుగలదియునగు నావపై మేమెక్కెదము. అ. 7. 6. (7) 3

**కపోత సందేశము** :—మాయింటిలో తప్పుదారులు ద్రొక్కని దివ్యమగు, పావురముండి మాసందేశముల గొంపోవుగాక ఋ. 10.165.2

మంచి యుద్దేశములతో పావురమును బంపుడు. ప్రసన్నులై వరములకు సందేశముల బంపిన నది మాసందేహముల దీర్చును. ఋ. 10. 165. 5

**సంయమము** :—ఆచార్యుడు, రాష్ట్రపతి, సంయము, బ్రహ్మచర్యములతో నుండుట మంచిది. సంయమియగు రాజే ఇంద్రుడన బరగును. అ. 11. 5. 67

రాజు బ్రహ్మచర్యము వలననే రాష్ట్రమును పాలించును. ఆచార్యుడు బ్రహ్మచర్య మూలముననే విద్యార్థులను బ్రహ్మచారులుగ జేయును. అ. 11, 5. [7]

బ్రహ్మచర్యముచేతను, తపస్సుచేతను దేవతలు మృత్యువును జయించిరి. అ. 11. 5. [7]

**వివాహము** :—ఓ తపోనిష్ఠబ్రహ్మచారీ! నీ సుందర మూర్తిని నా మనము వరించినది. ఋ. 10. 183. 1

ఓ వధూరత్నమా! నీ సుందర శరీర సౌభాగ్యమును ఋతుకాలిక సంయోగముచే సార్థక మొనర్పుము. నిన్ను నే మనసార ప్రేమింతును. నన్ను వివాహమాడి సంతానమును బడయుము. ఋ 10. 183. 20

వివాహమును గోరు స్త్రీలెందరో పురుషుల తీయని మాటలకు మోసపోయి వారియధీన లగుదురు. అయిన కుల స్త్రీ [భద్ర] సభలో తన పతిని వరించును. ఋ 10. 21. 12

పిండని యావులవలె నవివాహిత స్త్రీలు (కన్యాత్వము, కుమారావస్థ) ను త్యజించిరి. వీరు నూత్న జ్ఞానపూర్ణలై గర్భధారణ మొనర్తురు. ఋ 3. 55. 16

ఔషధములు :— మూడు యుగములకు ముందు దేవతలచే నుత్పన్నములగు నౌషధములు నూటయేడు జాతులకు సంబంధించినవిగ నున్నవి. ఋ10. 97. 2

'పరియగు వైద్యుడు రోగికి తగినట్లుగా మమ్ము నియోగించిన రుగ్ణతను సమూలముగ బోకార్చి' యారోగ్య మొసగెదమని' యౌషధములు సోమరాజుతో ననుచున్నవి. ఋ 10. 97. 22

ఏక కాలమున నిద్దరు భార్యల నిషేధము :— రథమునకు గట్టబడిన గుఱ్ఱము రెండు నొగల నడుమ బిగింపబడి నకిలించురీతి యిద్దరు భార్యలు గలవాడు కష్టమనుభవించును. ఋ 10. 10. 11

అతిథి సత్కారము :— అతిథినివదలి భుజించువాడు ఇంటిలోని సుఖమును, పూర్ణత్వమును, రసమును, పరాక్రమమును, వృద్ధిని, ప్రజ, పశువులను, కీర్తి, శ్రీ జ్ఞానములను దినుచున్నాడు. అ 9. 6. 3.

అతిథి రాగా లేచి యెదురేగి, సంబోధించి 'మీరెటనుండి వచ్చితిరి? ఇదో యీ జలముల దృప్తులు గండు, మీకు గావలసిన వస్తువును గొనుడు. మీకిష్టమైన దానినే జేయుదును' అన వలెను. అ 15, 11, 1—2.

